శ్రీరస్తు.

# ఉద్యానము

(నిర్వచనము)

రచయిత:

చల్లా పిచ్చయ్యశాస్త్రి.

33



ముద్రాపయిత:

ముళ్లపూడి తిమ్మరాజుగారు,

ద్రాజవరపు యెస్టేటు జమీందారుగారు.

# ముద్రాపయితృవంశావళి.

సీ॥ శ్రీలం బొంపొందు యశముసం ♦ బెన్నైమిగిలి
ధనకనకవస్తు వాహనా ♦ ద్యనుపమాన
విభవసంయుక్తమయి భువి ♦ వెలయు "ముళ్ళ
పూడి" వంశంబు హరి కృపా ♦ పూర్ణమగుచు.

శా. అందున్ వార్ధిధరజ ప్రసూనములుదయంబందెన్ ♦ జగద్విశ్రుతా
స్వం దాఖండ యశో విశాలుఁడయి గో ♦ ష్పంగాంచె స
ద్బృందమా
కందంబై "పెదబాపయా"ఖ్య గుణి "అ ♦ క్కాయమ్మ"
యర్ధాంగియై
చందన్ వెన్నెలవోలెఁ రక్తిమెయిని ♦ చ్చల్ గూడి
సేవింపఁగాన్.

ఉ. కలిగెన్ వారికిఁ బెంటి నోముఫలమై ♦ కన్పండువై పండువె
న్నెలచందంబున నెల్లవారలకునిం ♦ చెన్ బెంచె నాహ్లాద
మున్
గలితశ్లోకుఁడు "తిమ్మనా"ఖ్యుఁడను ర ♦ క్తిన్ సాధ్వి "నా
శాలమ్మన్"
వలపుల్ చూఱలనిచ్చి పట్టెఁ గరమున్ ♦ వంశంబు శో
భిల్లఁగాన్

సీ. వారల కుదయించె ♦ ధీరుఁ డుదారుండు
వేంకటరాయనా ♦ మాంకితుండు
పతిదేవతా మణి ♦ భవ్య "అక్కాయమ్మఁ"
జేపట్టి రహిమహా ♦ శ్రీల యొసఁగ
గోదావరీ పావ ♦ నోదక సంవృద్ధ
కేదారముల పెంపు ♦ గీలుకొలిపె
ఉండ్రాజవర మహీ ♦ శుండయి నలుదెసల్
* సౌందర్యమున జ్యోత్స్న ♦ జాలుకొలిపె

గీ. బాంధవప్రేమలత కాల ♦ వాల మనఁగ
బీదసాదలకున్ కల్ప ♦ వృక్షమనఁగ
న్యాయదృష్టికి దివ్యాంజ ♦ నంబనంగఁ
విబుధ వినుతికిఁ బాత్రమై ♦ వెలయుచుండు.

క. ఈ యిర్వుర కుదయించెన్
శ్రీరమణుని కృపను సుగుణ ♦ శేవధి బుధబృం
దారక వసుధా గతముం
దారమనఁగ "తిమ్మరాజు" ధన్యుఁడు ఘనతన్.

సీ. వ్యవహారమం దే స ♦ బద్ధమాడఁడటన్న
సత్యసంధత వేఱె ♦ చాటవలెనె!

---

* ఈ ప్రాస యతి అప్పకవి యొప్పు.

విద్వత్కవుల గోష్ఠి ♦ విహరించు నతఁడన్న
భాషాదరము వేత్త ♦ పలుకవలెను!
శ్రీ రామచంద్రు భ ♦ జించు చుండునటన్న
దేవభక్తిని వేత్త ♦ తెలుప వలెను!
కాలమ్ము వ్యర్థమ్ము ♦ గాఁ ద్రోయుఁడటన్న
సమయస్ఫురణ వేత్త ♦ చాటవలెను

గీ. శాంతికి నిధాన మఖిల హ్యా ♦ దంతరాళ
భావ్యభవ్యగుణుండు స ♦ ద్వర్తనుండు
శ్రీయుతుండొ ప్ప శ్రీ ♦ "కమలాయతాక్షి"
సతి సిరుల్ గూర్ప "తిమ్మరా ♦ జ ప్రభుండు."

---

శ్రీ ర స్తు.

# ఉద్యానము.

(నిర్వచనము)

శా. శ్రీరాసుల్ వెలయించుకాలువలతోఁ ♦ జెన్నొందుకృష్ణానదీ
వారిన్ మజ్జనమాడి, శైలశిఖరా ♦ వాసన్ ద్విషద్భీకరా
కారన్ భక్త జనావనం గనక దు ♦ ర్గం గొల్చి తత్క్షేత్రయా
త్రారంభంబునుపక్రమించిచనుచోఁ ♦ నందొక్క చోఁ గ్రొత్తయై.

గీ. ఆంతరంగికశుద్ధి బ ♦ యల్పడంగఁ
జేయుక్రియమునఁ దెల్లనై ♦ చెలువుమిగుల
నాకసంబాను సుకవులఁ ♦ యశమనంగఁ
గానఁబడెనొక్క మేడ శృం ♦ గములతోడ.

గీ. ప్రక్కలను ముందువెన్కలఁ ♦ జిక్కనైన
సందడుల కింతయేనియు ♦ సరకుఁగొనక
పువ్వునందేటివోలె జివ్ ♦ జివ్వమనుచు
సూటినామేఁడమీఁద నా ♦ చూపువ్రాలె.

క. చొచ్చెడివారల వేగము
వచ్చెడువారిట్టులనుచు ♦ వక్కాణింపన్

మెచ్చునకియ్యది మెచ్చని
చొచ్చితి లోపలికిఁ జూడ్కి ♦ సూడిదగాఁగన్.

క. క్రొక్కాఱుమెఱుఁగు మాడ్కిఁ ద
ళుక్కని యొకతేజుజిగి బె ♦ ళుకు నిగనిగతో
దృక్కుదనియించె వాణికి
నిక్కంపుఁ బ్రపత్తినిడ్డ ♦ నివ్వాళియనన్.

ఉ. అంతటసంతసంబు నెల ♦ వైయొకకొంత చరించితిన్ దద
భ్యంతరసీమలందు నెదు♦రయ్యె మణీమయసాలభంజికల్
వింతగఁ బల్కినట్లుకదు ♦ వేడ్కఁగరంబులు చాచినట్లు వి
భ్రాంతియొకింతయేనిఁ గను♦పట్టకదిట్టతనంబుఁ జూపుచున్.

ఆఁచటఁగొంత దవ్వరుగ ♦ నద్భుతమై యొకసీమతోఁచె! న
చ్చోఁదనరారునంతరము♦చొప్పదియెంతయొ! గ్రంథదేశముల్
ప్రొదియొసర్చె!భావపుర ♦ ముల్ రవణిల్లె!రసప్రవాహముల్
పాదయినట్టి స్థాయిగిరి♦ప్రక్కలఁ బాఱుచునుండె నిండుగన్.

క. కవితోద్యానం బొక్కఁటి
దవులం గన్పట్టునందు ♦ దళిదుత్పలముల్
నవచంపకములు మివులర
హివహిన్ నలపించె హాయి ♦ యొలపయ్యెరలన్.

మత్తకోకిలగాన ♦ మాధురి చెవికెక్కె;
నలినలితేట గీ ♦ తులు రహించె;

మేఘవిస్ఫూర్జిత ♦ శ్రీఘనత్వం బొప్పి;
వనమయూరము తాండ ♦ వము రచించె;
మాలినీగణము లు ♦ య్యాలలూఁగఁ దొడఁగ;
మలయజ పాదపం ♦ బులు తనర్చె;
దృఢలయగ్రాహిగా ♦ తృచయంబు చెన్నొందె;
సాధ్వీమతల్లుల ♦ జాడ తోఁచెఁ;

గీ. బూఁచె నంబురుహంబులు ♦ పొలిచెఁ బృథ్వి
సరస సంచార యోగ్యమై; ♦ జాలుకొని యె
మంతుగొన్న వసంతది ♦ నాంత వేళఁ
జెలువమందుఁ దదుద్యాన ♦ సీమయందు.

క. కొండెలు వాగ్బ్రహ్మలటన్
గందాహారులయి యొప్పి ♦ కదలక సతమా
నందంబునఁ దోఁగుచుఁగ
స్వాదొనరించిరి తదీయ ♦ విలసన మసదో!

మ. మనుసంశోదిత మౌక్తికంబుఁగవిరా♦ణ్మందారముద్యత్కళా
ఖనిచాళుక్య శిరోవిభూష సుగుణ ♦ గ్రాహిప్రధానుండుసా
ధన సంపన్నుఁడు విష్ణువర్ధనుఁడు వి♦ద్యామూర్తి శ్రీరాజరా
జనరేంద్రుండొకచోఁగనంబడెయశ♦స్సౌధాగ్రభాగంబునన్.

సీ. రత్నంబు లెన్నియో ♦ రాశిఁబోయుచునున్నఁ
గవిపద్యరత్నంబ ♦ కాంక్ష నెఱపు;

సౌధంబులెన్నియో ♦ చలువలీనుచునున్న
భావసౌధంబులో ♦ పలన నిలుచు;
దీర్ఘికలెన్నియో ♦ దృష్టిలాగుచునున్న
నవరసంబులయంద ♦ నాటుమనసు;
హారంబులెన్నియో ♦ యక్కునవెలకొన్న
గుణహారముల యంద ♦ కోర్కెవ్రేట్లు;

గీ. అతఁడలంతియొక్క ♦ యవిధినేగినదన
తరుణ్నైన నొడిసి ♦ తలుగువాఁడు
విష్ణువర్ధనుండు ♦ వేఁగిదేశపు రాణ్మ
హేంద్రపుర వరంబు ♦ నేలువాఁడు.

—♦ నన్నయ భట్టు. ♦—

క. ఆరాజర్షి కులగురు
ధీరుఁడు బ్రహ్మర్షి యొకఁడు ♦ తేరితాగ్నులతోఁ
జేరువ గుముల్లై శిష్యులు
తోరంబుగఁ గొల్వఁదోఁచె ♦ దుర్నిరీక్ష్యుఁడు పోలెన్.

గీ. జన్మము తరింప నమ్మహా ♦ శయునిఁ గుశప
విత్రశయునిఁ గనుంగొని ♦ విమల భావ
పుష్పములు భక్తి నర్పించి ♦ మోడ్పిలనున్న
శిష్య సంఘమ్ము కృతముఁ జ ♦ ర్పించుచుండ.

ఉ. ఒకతఱి వేదపాఠములు ♦ నొక్కతఱిన్ స్మృతిశాస్త్రపాఠముల్
ప్రకటముగాను జెప్పుచును ♦ బ్రక్కలగంటములూదియున్న లే
ఖకులను వ్రాయుఁడీయనుచు ♦ గబ్బముఁ జెప్పుచుఁ గొంత సే
పుకా
వ్యకళలఁ బ్రోద్బవుచ్చుచును ♦ సంభ్రముసూపె శతావధానియై.

గీ. అమ్మహీదేవు నిలువేలు ♦ పట్టు లరయు
వాఁడు మ్రోలను గొల్వున్న ♦ వాఁడు నన్న
పార్య! వాగనుశాస్త! ను ♦ దంకితముగ
బాచమా మ్నాయమాంధ్రోక్తి ♦ బలుకుమనియె.

ఉ. దానికిమెచ్చి యాంధ్రకవి ♦ తాజనకుండు సుదర్శనుండు వి
ద్యానిధి వల్లెయంచుఁదన ♦ యంతటివాఁడొకరుండు చెల్మిఁదో
డై నడువంగ భారతము ♦ నప్పుడరణ్యము దాఁక జెప్పెవా
చానవనీర జోదితర ♦ సప్రసర ప్రకటాంశుధారలన్.

ఉ. చూడక కాదుమూలమును ♦ జూచి యెఱుంగక కాదయర్థమున్
బ్రోడయతండు భాష కెఱు ♦ ముద్దగునోయటు వ్రాసె నేర్పునన్
వాడలవాడలన్ సుకవి ♦ వల్లభులాఘ్యుఁ డితండయాచుఁ జే
ర్వాడఁ ద్రిలింగ వాఙ్మయముఁ ♦ బాగుగఁ గట్టడఁ జేసె వ్యాకృతిన్.

ఉ. ఆయనఘుండు వాగ్త్రయర ♦ హాస్యములన్ గనువాఁడు భారతా
మ్నాయమునందు నింపిన స ♦ మగ్రకళాకవితా ప్రదర్శితా

క్ష్యాయతనూత్నమార్గముల♦యాదముచందము తోఁచునంత నే
హాయికి హాయివుట్టునన ♦ నాదలఁబూఁపరె సభ్యులుబ్బునన్.

గీ. లేదు కాఠిన్య మింతయుఁ ♦ బాదపూర
ణార్థమొకయక్కరమ్మ వా ♦ క్యమునఁ బడదు;
తావులకుఁ బొందువడని శ ♦ బ్దములు చొఁరవు;
నన్నపార్యుని కావ్య సం ♦ ధానమందు.

ఉ. పొంపగ నందునందను బ్ర ♦ మోదపకీర్త మిళిందగీతికా
తుందిలరాజహంసముఖ ♦ తోయవిహంగ నినాదమేదురా
నందద సుందరాంబుజ వ ♦ నప్రచయాగత మందమారుతా
మందగుణత్రయోచిత స♦మాసములన్నలకొల్పె మెల్పునన్. ౪

—♦ తిక్కన సోమయాజి ♦—

క. అటఁగదలిచనఁగ నందుఁ గ
స్ఫుటభావ పరిమళంబు ♦ సొంపడఁగ శ్రవః
పుటపేయధ్వని యెగుప, ని
కటమున నొకయాశ్రమమ్ము ♦ కన్పిందమ్యోఁ.

గీ. గళమునం దాల్చు కొనునది ♦ కౌస్తుభంబొ !
కలికిచెముకల దండయో! ♦ కమిచి మ్రింగ
నీకురుచి కాలకూటమో! ♦ లేక నంద
పత్నిచనుఁబాలో తెలుపుమో ♦ ప్రభువ! యనుచు.

హరిహర నాథాత్మకమగు
పరమాత్మ నభేదవృత్తి ♦ భావించుచు సం
బరమున నెలకొనిన కపీ
శ్వరు యజ్ఞేశ్వరునిఁ గొల్చు ♦ వానిం గంటిన్.

కాంచికృతార్థతం బొరసి ♦ గాఢసుగంధవ దాజ్యహోమధూ
మాంచితమైన కన్నుకెడ ♦ లారయ లేమినొకింతసేపు గు
ర్తించుట కోపనైతిసవ ♦ రించుచుఁ గేల్గవదోయిలించుచున్
సంచుననొక్కకొందఱు క ♦ నంబడి రిర్గడలన్ నృపాలకుల్.

గీ. వారుకొందఱు గణపతీ ♦ శ్వరులు, కొంద
ఱరయ నెల్లూరు మండలే ♦ శ్వరులు, మనుమ
సిద్ధిరాజులు ననితోఁచెఁ ♦ జిత్తమునకుఁ
దక్కొరులు సోదరులు సుహృ ♦ ద్వరులు కవులు.

క. క్రొత్తలు నిగనిగ లొగిదళు
కొత్తఁగ నా సోమయాజి ♦ కోవిదు చెంతన్
జిత్తరువుఁ జేసె నన్నుం
గత్తియు గంటంబు వాఁడి ♦ గల కొనమొనలన్.

క. శ్రీరమణుని యాఱవ యవ
తారంబపు డాత్మఁదోఁచెఁ ♦ దత్కవిగోష్ఠిన్
జేరుఁడు నొకఫలకముపై
పై రేఖలు తీర్చివ్రాయఁ ♦ బడినది వెలసెన్.

సీ. ఏకశిలానగ ♦ రీశ్వరుం డౌ గణ
పతిరాజు సభఁ బేరు♦వడసినాఁడు;
బుద్ధివృత్తుల నూఁగు ♦ బౌద్ధులఁ బెక్కండ్ర
మించివాదమున ఖం ♦ డించినాఁడు;
మాస్తుర పాలైన ♦ మనుమ సిద్ధిశుఁ గ్రి
మ్మఱ రాజ్యమిప్పించి ♦ మనిచినాఁడు;
కవులు మ్రొక్కులు వెట్ట ♦ గడుఁ గ్రొత్త క్రొత్తగా
కవిశిల్పముఁ బ్రక ♦ టించినాఁడు;

గీ. చతురుఁ డంతర్ముఖుఁడు చతు ♦ ష్షష్టికళల
నారితేఱిన వాఁడఖి♦లాత్మ వేది
వ్రాసె నిర్వచనోత్తర ♦ రామచరిత
శేముషీరాజ తిక్కన♦ సోమయాజి.

క. అనియున్నది తచ్ఛాసన
మున; దాని జదివి వేడ్క ♦ మొలతేరఁగఁ జ
క్కని యల్లికగల యక్కవి
ఘనాశ్రమము పొలుపు మరలఁ ♦ గనుగొంటి నటన్.

గీ. కానఁబడెనందు నొకవిలే ♦ ఖకుఁడు: చేత
నాకుగంటము కల; దెవ్వ ♦ డాతఁ డనిన
నాశుధారలఁ బత్రమ్ము ♦ నందు నించు
నట్టి కుమ్మరి గురునాథుఁ ♦ డనిరి పిదప.

ఆ. వింటి భారతంబు ♦ వీనుల విందుగాఁ:
బరఁగినే విరాట ♦ పర్వమాది
గాసమగ్రముగను ♦ గవులు కేతన ముఖ్యు
లచటివారు హాయి ♦ హాయి యనఁగ.

ఆ. ప్రభువు వాక్కీర్తిఁ ♦ బ్రాప్తమై యున్నది;
సంగ్రహమ్ము శక్తి ♦ చాలఁగలదు.
వచనరచన నోడున ♦ వలనుగా; నాచితిఁ
బ్రాణమ్ములు నిలిపె ♦ భారతమున.

గీ. నాయకోదాత్తతకుజీవ ♦ నంబునోసె;
పాత్రముల నెట్టునట్టుచుట్టి ♦ పదరచించె;
చిత్తవృత్తులఁ జిత్రించెఁ ♦ జిత్తరువుల;
వృత్తములఁ రసాభ్యుచితసం ♦ పత్తి నడపె.

మ. నవలాలీలలు నాటకమ్ములగతుల్ ♦ నానారసోద్భేదముల్
వివరించెం; బ్రతిభావిశేషమును ని♦ర్వేలంబుగాఁ జూపెఁ; దా
గవిమాత్రుండగాకొ? సోమయరాజ! నవతా ♦ కందంబు,
స్వాతంత్ర్యమూ
ర్తి, వదాన్యప్రముఖుండు దిగ్విదిత కీ♦ర్తి స్ఫూర్తి నిక్కం
బుగన్.

—♦ నాచనసోముఁడు. ♦—

క. అది కడచి చనఁగ సమ్మేప
మొదవించె; మఱొక్క యాత్ర ♦ మోపాంత; మ్మా
దుఁడసరు కవియుగ యజ్వను
గదియు నెఱినినించు మించు ♦ గానూంహాలలో.

గీ. వినిచె నుత్తర హరివంశ ♦ మొనసియున్న
వాఁడు నాచనసోముని ♦ పద్యమున్మృత
మండల మటంచుఁ బాడన ♦ మ్మహితుఁ గొలిచి
మీఁద నొకకొంత దవ్వగఁ ♦ మించునంత.

—♦ ఎఱ్ఱాప్రగడ. ♦—

సీ. చేఁగంకణము గట్టి ♦ శ్రితజనావనదీక్ష
ననిశం బనుష్ఠించు ♦ నట్టిదాఁత
అఖిల దిక్కులను జ ♦ యధ్వజంబులు నిల్పి
యద్దంకి పురమేలు ♦ నట్టినేఁత
పిఱుల తలలు ద్రి ♦ ప్పించు మల్లారెడ్డి
గాదిలి తోడుగాఁ ♦ గలుగు జేత
సకసత్కీ వర్తుం ♦ ప్రై కాఁటెఱుంగని
భవ్యతేజంబునఁ ♦ బరఁగు త్రాత

గీ. సప్తసంతానములొనర్చి ♦ శాంతిగలిగి
యీశ్వరారాధనంబున ♦ నెసఁగువాఁడు

పల్లవాదిత్య బిరుదవి ♦ భ్రాజితుండు
వేమ భూమీవరుండు క ♦ న్వింద్రోనర్చె.

గీ. అప్పపాటుల మఱచిన ♦ దృష్టిదనివి
వోవఁ గాంచి యావేమపృ ♦ థ్వీనరేణ్యు
సరస సరసప్రబంధ సం ♦ చయము గేలఁ
బట్టినిలిచిన యొక కవి ♦ వరునిఁ గంటి.

క. చక్కని ముత్యమ్ములవలె
నక్కరములు తీర్చికూర్చి ♦ నటులున్నవి యం
దొక్కటి స్నహరిపురాణ
మొక్కటి భారతము శేష ♦ మొగిఁగనఁ బడియెన్.

క. మూఁడవ గ్రంథము నామము
జాడయుఁ గనుపడ దేఁడు ♦ సంభ్రమమున నా
వేఁడిన హరివంశము కృతి
నేఁడియ్యెడవినుచు మయ్య ♦ నెఱిప్రగడకవీ!

మ. అనవిన్ వెంటనె శంభుదాసుఁడును ని ♦ త్యానందసంధాయిభా
వనిరూఢిన్ నెలకొన్న కృష్ణచరితన్ ♦ వాగ్రూపమున్ దారచిం
చిన దానిన్ వినిపించె; భూపతియు ని ♦ శ్చేష్టాత్ముఁడై
సొక్కునన్
వినియెన్ ధన్యుఁడ ధన్యుఁడన్ బ్రథితుఁడన్ ♦ విన్నాణి
నంచెన్నుచున్.

గీ. యవ్వనము మెచ్చుకొనుచుఁదా ♦ నల్ల నల్ల
నరుగుదెంచెడు నొకవీర ♦ పురుషుఁ గంటి
ధుర్యసాహిణి బిరుదాంకి ♦ తుండతండు
కొంతవడి కొక్కయాశ్రమ ♦ ప్రాంత మొలసె.

గీ. అందున వాలుకక్కి భాస్కరుం ♦ డాత్మజుండు
మల్లికార్జున భట్టు గు ♦ ణోల్లసితుఁడు
రుద్రదేవుఁడు శిష్యుఁడా ♦ రూఢబుద్ధి
నెచ్చెలియు నయ్యలార్యుండు ♦ నిండి కొలువ.

మ. కొలువై వేడ్కనువానికిన్ విని చెంబ♦ల్కుల్ తేనెలూరింపఁగా
తెలుగున్ మూలమెఱింగి కూర్చినరసా♦బ్ధిన్ రామచారిత్రమున్
తెలిపెన్ సంగ్రహాశక్తి కొల్పె స్ఫుట ర♦క్తిం దేట తెల్లంబుగా
గెలనన్ శ్రోతలు మేలు మేలనుచునం ♦ గీకారముం జూపఁగన్.

ఆ. కన్న భూమివరులఁ ♦ గమనీయ రూపంబు
విన్న కవుల మధుర ♦ విశ్రుతములు
వాక్కులోలి మదిని ♦ బల్మరు దలఁచుచుఁ
దోట నేగుచుండ ♦ దూఁగియొకట.

—♦ శ్రీనాథుఁడు ♦—

సీ. ముత్యాలశాలలో ♦ నిత్యముఁ గవిగోష్ఠి
నేపారు దక్షిణా ♦ ధీశ్వరుండుఁ

గదలిన కస్తూరి ♦ గమగముల్ వలపించు
సాంపరాయని తెల్గు ♦ జన విభుండు
నమరిన తనయాఖ్య ♦ సార్థకంబుగ మన్న
సర్వజ్ఞ సింగన ♦ క్ష్మావరుండుఁ
గుటిల శాత్రవకోటి ♦ గుండె గాలంబయి
పేరు గాంచిన కొండ ♦ వీటి ఱేఁడు

గీ. వేత్రహస్తులు తోవఁ జూ ♦ పింప ముందు
ఠీవిఁ జనుచున్న వారలా ♦ పూఁప్రుఁదోఁటఁ
బిత్తిఁదివారల నడిగి వే ♦ ర్వేఱవారి
వెల్ల గొడుగుల నీడనే ♦ వెడలి నడవ.

క. ఒక చక్రుని యాశ్రమ భూ
మి కనులవిందయ్యెనందు ♦ మెలఁకువఁ జనియే
లిక లోఁగిఁ గూర్చుండిరి వీ
రికి ముందే యుండిరచట ♦ నృపసచివవరుల్.

సీ. కాశికాఖండంబు ♦ కవిత తీర్పగుసంచు
వీరభద్రారెడ్డి ♦ పేరుకొనఁగ;
భీమఖండము జిగి ♦ బిగువొందుఁ గనముంచు
సన్న మంత్రీశ్వరుం ♦ డలరి కొలువ
శృంగారనైషధ ♦ శ్రీ కూర్పు నేర్పించు
మామిడిసింగన ♦ మంత్రి పొగడ

హారవిలాసముకైత ♦ హారువు మేల్మిరువంచు
నవచిదేవయ తిప్ప ♦ యధిపుఁడాడఁ

గీ. గొలుచు శారద నిర్మాల్య ♦ కుంకుమంబు
దహారమునఁ దాల్చి, నవకవి ♦ తా ప్రభుత్వ
సార్వభౌముండు జరిబుటా ♦ శాటిఁ గప్పి
వచ్చె నచటికి శ్రీనాథ ♦ భట్ట సుకవి.

శా. ఆపైదుందుభిమ్రోఁతతోమధురరా ♦ గాలాపమేపార, భా
షాపాండిత్యవచోవిజృంభణములా♦శ్చర్యంబుఁగొల్పంగ, నా
యూహా త్తమ్ములముద్దుగావినిచెస ♦ భ్యక్షోణిభృద్వర్గముల్
కైపుంగొన్నటుపారవశ్యమునఁజ♦క్కందోఁగితూఁగాడఁగన్.

గీ. అఁను మున్నుడి శాంతన ♦ యాంకితమ్ము
కలది శివరాత్రి మాహాత్మ్య ♦ కావ్య; మదియు
వింటిని; మరుత్తరాట్కథ ♦ పేరు మాత్రఁ
జదివెనటు శాలివాహన ♦ సప్తశతియు.

గీ. వేళయగుటను పై రెంటి ♦ విడిచి చనిరి
యెవరి యింట్లకు వారు నా ♦ యెలమి యొంత
యనుచుఁ బేర్కొందు! శ్రీనాథు ♦ నరయఁగంటిఁ!
దత్కవిత్వమ్ము మహిమ హృ ♦ ద్యముగ వింటి !

సీ. ఘనరాజసపుఁబోక ♦ తనయందకాక త
త్కవితాకుమారికి ♦ దాఁపినాఁడు;

చిప్పిలఁ గ్రొందేనె ♦ జీవకళల్ నింపి
పూజ్యకావ్యేందిరఁ ♦ బ్రోఁచినాఁడు;
కులుకురాయంచల ♦ పొలుపుమేల్నడలతో
సీసమ్ముఁ బలుపోఁతఁ ♦ బోసినాఁడు
జిగిచికిలీపనిన్ ♦ శృంగార లక్ష్మికిఁ
గ్రొత్తసొమ్ములు మేనఁ ♦ గూర్చినాఁడు

గీ. సరసులకు మేనఁబులకలు ♦ జాదు కొలుపు
భావములు గుప్పి, నేర్పు గ ♦ న్పఱచినాఁడు
భట్టపదవాచ్య సత్కవి ♦ పట్ట భద్రుఁ
డై తనరినాఁడు శ్రీనాథుఁ ♦ డరుల త్రోడు.

క. వక్రోక్తియొడుపుసహజో
పక్రమ వైచిత్రి ♦ మధురఫణితి స్ఫురణల్
చక్రముఁ ద్రిప్పు సమాస
ప్రక్రియమాసుకవి సార్వ ♦ భౌముఁడె యెఱుఁగున్.

గీ. ధారగంగాఝరికిఁ దోడు; ♦ తళుకు మొందు;
వర్ణనయుఁ గంటికగుపడు; ♦ వరుసకలదు;
ప్రస్తరించిన యట్లుండు ♦ వచనరచన;
సార్వభౌమున కెవ్వరు ♦ సాటిజగతి.

—♦ సూరన ♦—

క. అవలనొక కొంత చన దా
దవులం గన్పించెఁ దబిసి ♦ వాటి యొకటి త
త్సవిధమున నొక్క విగ్రహ
ము విరూపాక్షాఖ్యఁ బొరసి ♦ పొడసూపె వెసన్.

ఆ. వెడఁద యురము, కళలు ♦ వెలయు నెమ్మోమును
బొడవు కేలు గవయుఁ ♦ బొంక మొప్ప
భావజాకృతినిఁ "ప్ర ♦ భావతీప్రద్యుమ్న"
కర్త భాగ్యవశతఁ ♦ గనులఁ బడియె.

ఆ. ఆకుపీటి వేంక ♦ టాద్రి "రాఘవపాండ
వీయ" కృతిని గొన్న ♦ వేత్త యొకట
లలితకల్పనలఁ గ ♦ ళాపూర్ణోదయంబు
గృతిని గొన్న కృష్ణ ♦ పతియు నొకట.

మ. మఱియుం గొందఱు పండితోత్తములు స ♦ మాప్తుల్ తగం
గొల్వఁగా
నెఱుకన్ మిక్కిలి పేరు గాంచిన గుణా ♦ న్వితుండు శా
స్త్రాంబుధుల్
నెఱిమంథాచలమట్లు ద్రచ్చినకళా ♦ నిష్ణాతుఁడే తెంచె నే
ర్పెఱుమై పింగళి సూరనార్యకవియుం ♦ తే వాసిసంఘంబుతో!

గీ. నవరసంబుల చలువల ♦ నవక మెసఁగి
రక్తి చివురింపఁదియ్యని ♦ సూక్తిసుమము
లలరు శ్రీకల్పనావల్లి ♦ యాలవాల
తటమునందునఁగూర్చుండె ♦ దఱియెఱింగి.

సీ. ఆకు జొంపమ్ముల ♦ నణఁగిన చిలుకల
గుంపైన నొకట గు ♦ ర్తింపవచ్చు
బాఁడువెన్నెలలో న ♦ భంబుపై తారకా
శ్రేణినైనను లెక్క ♦ సేయవచ్చు;
క్షీర ధారాంతర ♦ స్థితి సమ్మిళితమైన
పానీయమైన నే ♦ ర్పఱుపవచ్చుఁ;
గనుగప్పి విషయంబు ♦ లను మాటువడు చిత్త
వృత్తులనేని రూ ♦ పింపవచ్చుఁ;
గీ. గాని పింగళి సూరన ♦ కల్పనాల
తాగృహంబున మలయు గుక ♦ థాలలామ
రూపమెవ్వఁడు రూపింప ♦ నోపుననుచు
సభ్యులు నుతింప గ్రంథసం ♦ చయము సదివె.

క. ఆ శయ్యామెత్తఁదనమే
మీ! శరవేగంబు నతిశ ♦ యించెడు తద్ధా
రా శుద్ధియేమి! మఱియా
కైశికవృత్తి యును నేమి ♦ కడు హృద్యంబౌ!

క. అసిధారా వ్రతమునను సా
గసులకు నే లోటులేని ♦ కరణి వచించెన్;
రసికులు మెచ్చఁగఁ ద్వ్యర్థము
లెసఁగుఁగావ్యముల; నాతఁ ♦ డే తాదృశుఁడే.

క. అనులోమ విలోమమ్ములఁ
దెనుఁగును సంస్కృతము నొక్క ♦ తీరుగ నడపిం
చిన రీతియ సూరనకవి
యనూనమతి విస్ఫురణము ♦ నాని వచించున్.

—♦ పో త న ♦—

గీ. దానిప్రక్కన నొకకొంత ♦ దవ్వుఁ జనఁగఁ
బాదములకడ హనుమ పా ♦ ర్శ్వముల ననుఁగుఁ
దమ్ములును, నంకపీఠ సీ ♦ తమ్మ కొలువ
రాముఁ డేలెడు నొక్కయా ♦ శ్రమము తోఁచె.

గీ. అంతరామునిఁ గొల్చియ ♦ య్యాశ్రమంబుఁ
జొచ్చితి; న దేమొ కాని యఁ ♦ చ్చోటునందు
చండమార్తాండు తేజము ♦ సంస్కరించు
దండితేజంబు కన్నుల ♦ పండువయ్యె.

మ. కలిత శ్రీదనరారి యందు నొకయి ♦ క్కన్ ద్వాదశ స్కంధముల్
గలమాన్రినొక్కటి తోఁచె; దాని మొదటన్ ♦ గాంధర్వ విద్యాబ్ధిపీ

చుల నుయ్యాలల నూఁగుచు న్నగుచు మె ♦ చ్చుల్ సూపెఁ
గృష్ణుండు ప్ర
క్కలనో గోపకగోపికల్ గొలువ శృం♦గారం బపారంబుగన్.

ఆ. పాదులోన నాటి♦బహు భద్రముగ దాని
రసముపోత పోసి ♦ ప్రాణమొసఁగఁ
బెంచి తనకుఁగ ♦ ల్గుపేరు సార్థకముగఁ
దాల్చినట్టివాఁడు♦ధన్యతముఁడు.

సీ. తన దేహ నిర్లక్ష్య ♦ తాయథార్థతఁ గటి
పై నున్న వల్కలాం ♦ బరము నుడువఁ
దనధన నిరపేక్ష ♦ తా మహిమమ్ము బా
లరసాల పద్యమ్ము ♦ సరణిఁ దెలుపఁ
దన నిరంతరకృతా ♦ త్మవిలోకనము నేర్పు
రాజిలుముఖము వ ♦ ర్చసముఁజాట
దన కృతార్థత్వమ్ము ♦ తత్త్వమ్ము నిత్యంబు
కవితాకుమారి ని♦క్కముగఁబలుక

గీ. సింగనంగన నారయల్ ♦ శిష్యవరులు
కొడుకుమల్లన తనవెంటఁ ♦ గూడిరాఁగ
భోగినీ దండకంబొక్క ♦ బుడుతవాఁడ
నాతలముఁ జేరె బమ్మెర ♦ పోతరాజు.

గీ. వినిచెఁ దనవాగ్విలాసమ్ము; ♦ వింటి భక్తి
సహజపాండిత్య బిరుదంబు ♦ సార్థకముగఁ
దోఁచెఁబాకంబు ద్రాక్షగు ♦ నౌచితియును
మేలు, శైలియునిలుపునే ♦ మెకమునేని.

—♦ పి న వీ ర భ ద్రు ఁ డు . ♦—

క. ఆయాశ్రమమ్ము కేడవై
హాయసపథ మాక్రమించి ♦ నట్టిది చుట్టుౕ
వేయూడలు దిగినది జటి
తోయముగల దొక్క మఱ్ఱి ♦ తోఁచెౕ ప్రోలౕ.

ఊ. తూఁచినయట్లు లొప్పిదము♦తో సమయంబు నెఱింగిపాత్రవృ
త్త్యౌచితిమై రసంబులరు ♦ దంద ఘటింపఁగఁ జాలుదిట్ట వా
చా చతురంత యానమున♦సాగెడుపోఁడిమ,యనూనచంద్రికా
రోచి? రుదూఢకీర్తియొక♦రుండు కవీంద్రుఁడటం గనంబడెౕ.

క. తెలియఁగఁ జేసె నతనిమో
సలజైమిని భారతంబు ♦ సరసోక్తి శకుం
తలపరిణయమ్ము నామది
యలరఁగఁ బినవీర భద్రుఁ ♦ డనుచుందోడ్తోౕ.

ఆ. అమ్మహాత్ముఁ గొలిచి ♦ యామీఁద నొకకొంత
దూరమరుగఁ బూవుఁ ♦ దోటయందుఁ

గానఁబడియెఁ రవల ♦ గలికితురాయితోఁ
గడలు కొన్నయొక్క ♦ యొదయమిన్న

సీ. కోనసీమకోతాన ♦ కొండవీఁడాదిగా
బహుపురంబులఁగొన్న ♦ బల్లిదుండు
ప్రతివసంతోత్సవా ♦ భ్యర్చిత విద్వత్క
వీశ్వరాశీర్వచో ♦ విశ్రుతుండు
ధీకళాస్ఫురణంబు ♦ తిమ్మరుస్సు రూపుగాఁ
దగిభూమి నేలిన ♦ ధర్మమూర్తి
రాజాధిరాజ శ్రీ ♦ రప్రతాపాదిక
బిరుదంబులందిన ♦ విజయశాలి

గీ. కవుల మది కెక్కఁగా బహు ♦ కావ్యములను
కూర్చినట్టి కలానిధి ♦ గుణపయోధి
భావపూజిత మదనగో ♦ పాలమూర్తి
యైన శ్రీకృష్ణరాయలం ♦ చాత్మఁదోఁచె.

ఆ. అతనిప్రోల నొక్క ♦ యద్భుతంబగు కవి
గోష్ఠికలదు క్రమ్మి ♦ కొనియొరకము
లైన భావసురభు. ♦ లఖిలదిక్కులయందుఁ
గొలనువోలెనింపు ♦ గొలిపెనందు.

ఆ. అష్టదిగ్గజంబు ♦ లని పేరుగాంచిన
వారుకవులు గలరు ♦ వారిలోన

నొకని మొన్న తోఁట ♦ యొద్దఁ జూచితిఁ దక్కు
వారి నిందుఁ గాంచు ♦ భాగ్య మబ్బె.

ఆ. అమరి యుభయ భాష ♦ నల్లికజిగిబిగి
యందుఁ బేరుగాంచి ♦ నట్టివాఁడు
తేఁ గదివి యుభంగిఁ ♦ దీర్చి కబ్బముఁ జెప్ప
నలఁతి యొక్కఁడ చటఁ ♦ జెలువుఁ గూర్చె.

మ. మనుచారిత్రము రామరాట్స్తవ మసా♦మాన్యార్థ మద్వైతముల్
బెనుపొందన్ రచియించె; నాశుకవితం ♦ బేరందె; బేరోలగ
మ్మున శ్రీరాయ లొసంగఁ దాల్చె బిరుదం♦బుల్ గండపెండారముల్
ఘనుఁడా పెద్దనయల్లసానికుల వి♦ఖ్యాతుండు సామాన్యుఁడే.

గీ. రామరాడ్భూషణుండని ♦ ప్రథితిఁ గన్న
భట్టుమూర్తి యొకండు చూ ♦ పట్టె నతఁడు
రామభజనాభిరతుఁడు హ ♦ నూమదంఘ్రి
కమ్మల సేవా సముద్భూత ♦ కవనసరణి.

మ. వసురాజన్యచరిత్రముల్ నరసభూ♦పాలీయముల్ వ్రాసెఁ బెం
పెసఁగంగా మనయాంధ్రభాషణములు పై♦ నెన్నో యలంకారముల్
పొసఁగించెం బ్రతిభన్ వధానసరణిన్ ♦ బొందింపుగాఁ గూర్చెఁ బా
డె సభాస్తంభములుం జివుళ్ళు బొడుగన్ ♦ కీర్తిన్ మహాగేయముల్.

శా. కాళీదత్త వరప్రభావజనితా ♦ ఖండప్రభాపుండుని
వ్యాళిం గన్నులకద్దినట్లు కవితన్ ♦ వాక్రుచ్చు ధీయుండు భూ

విష్ణు చిత్తీయమాదిగా ♦ వెలయు గ్రంథ
ములనురచియించి నాఁడు క ♦ ర్పూరగంధిఁ
గీర్తికాంతామణినిఁ గడల్ ♦ కెలని కడలి
తరగయూయెల నొండొరుల్ ♦ తవిలియూఁప.

అనియిటులంత ర్దృష్టిఁ
గొనబుగ సర్వంబుఁ జూచు ♦ కోవిదమణి వా
గ్వననిధి యొక విద్వత్కవి
యనవరత సుఖాబ్ధినోల ♦ లాడుచునుండెన్.

శ్రీ. శ్రీ. శ్రీ.

ఇది

ఉద్యాన పూర్వభాగము.